Annual Subscription Rs. 2/-only. Reg. No. M. 2749.

A TELUGU MONTHLY JOURNAL OF INSURANCE, BANKING AND FINANCE

# BHEEMA PATRICA

# భీమాపత్రిక

భీమా, బ్యాంకింగు, ఆర్థిక, వ్యవహారములను ప్రచారము చేయు మాసపత్రిక.

EDITOR:
S. KANAKARAJU PANTULU

PATRONS

1. K. B. MADHAVA Esq, M. A., A. I. A., (Lond.) F. R. A. S.
CONSULTING ACTUARY
Professor and Head of the Dept. of Mathematical Economics and Statistics,
MYSORE UNIVERSITY, MYSORE.

2. A. KALESWARA RAO PANTULU, Esq., B. A., B. L.,
BEZWADA.



VOL. V BEZWADA—AUGUST 1936 No. 8

# భీమా పత్రిక

గౌరవపోషకులు

మ. రా. రా. శ్రీ. కె. బి. మాధవగారు, ఎం. ఏ., ఏ. ఐ. ఏ. (లండన్) ఎఫ్. ఆర్. ఎ. ఎస్.

,, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, బి. ఏ., బి. యల్.

సంపాదకుడు: సూరంపూడి కనకరాజు పంతులు.

## భీమా పత్రిక

"భీమాపత్రిక" ప్రతిమాసమున కడపటివారములో ప్రకటింపబడును. జనవరి నెలతో సంవత్సరము ప్రారంభమై డిశంబరు నెలతో సంవత్సరాంతమగును. సంవత్సరములో నెప్పుడైన చేర్చుకొనబడిన చందాదారులు, వెనుకటి సంచిక లున్నయెడల ఆసంవత్సరములో వెనుకటి సంచికలనుగూడ పొందుట కర్హులు. సంవత్సరపు చందాలు విధిగ ముందు చెల్లింపబడవలెను. వ్యక్తులెవ్వరు చందాదారులుగ చేరి పత్రిక వి. పి. గా పంపుమని కోరెదరో యమాన పత్రిక మాత్రము వి. పి. గా పంపబడును. వి. పి. మొత్తము చేరినతరువాత లోగడ పత్రికలు బుక్కుపోష్టుద్వారా పంపబడును. పత్రికలలో ప్రచురింపబడవలసినవిషయము లన్నియు పత్రికాధిపతిగారికి పంపవలెను. మనియార్డర్లు, వ్యాపార సంబంధమైన విచారణలు మేనేజరుగారికి పంపవలెను. వ్యాసముల వాపసుగాని, ప్రత్యుత్తరములనుగాని కోరువారు పోస్టుచార్జీల నతికించి అడ్రసు వ్రాసిన కవరు పంపవలెను. వ్యాసకర్తలు, విలేఖరులు, ప్రచురణములకు పంపు విషయములలోని అభిప్రాయములకు సంపాదకులుగాని, ప్రకాశకులుగాని, ఉత్తరవాదులు కారు. సంవత్సర చందా రు 2—0—0. విడిపత్రిక రు 0—4—0.

వివరములకు:—మేనేజరు, భీమాపత్రిక, బెజవాడ.

## BUSINESS NOTICE.

The "Bheema Patrica" is published in the last week of every month. Subscribers who will not receive the Journal by the 15th of the succeeding month, will kindly communicate to the Manager.

The annual subscription is Rs. 2/- inclusive of postage. Single copy costs 4 annas Subscriptions at whichever time of the year be paid, will cover the period from January to December. All business communications should be addressed to the Manager. Contributions should be sent to the Editor. Articles on matters relating to Insurance are welcome. The Editor is not responsible for the views of the contributors.

For particulars:—The Manager, "Bheema Patrica" Bezwada (S. India).

ఇందులోగల ప్రకటనాదివిషయములకు వ్రాయునపుడు "భీమాపత్రిక" అను పేరుఉదాహరింపవలసినదిగ కోరుచున్నాము.

అయ్యా!

శ్రీయుత.................................

గారి సలహా ననుసరించి మీకు యీ పత్రిక పంపించడమైనది. మీరు యీ పత్రికను సాదరాభిమానముతో స్వీకరించి చందాదారుగ చేరి సంవత్సర చందా రు 2/—రెండు రూపాయిలను మనియార్డరుద్వారా పంపించకోరుచున్నాను.

బెజవాడ,
తేది 29—8—36.

మేనేజరు,
భీమా పత్రిక.




శ్రీ

## I

# గుంటూరు మహాసభ

## (Guntur Conference)

1936 సం॥రం సెప్టెంబరు 26, 27 తేదీలలో గుంటూరుపట్టణమున తృతీయ ఆంధ్ర దేశ దేశీయ భీమాకంపెనీ ఏజంట్ల మహాసభ సమావేశపరుచుటకు నిశ్చయమైనది. ఈమహాసభకు అధ్యక్షత వహింపవలసినదని కోరుచు శ్రీయుత డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారికి ఆహ్వాన సంఘమువారు ఆహ్వానముపంపినట్లు తెలియుచున్నది. జీవితభీమా వ్యాపారమున శ్రీయుత పట్టాభి సీతారామయ్యగారు మిక్కిలి అనుభవనీయులు. భీమావ్యాపారచట్టము త్వరలోమార్పు కానున్న సమయమునను ఏజంట్లు ప్రస్తుతములో తమకుగల కష్టములను తొలగించి ఇప్పటికంటె ఎక్కువవసతులను కలుగజేయవలసినదని కంపెనీలవారిని కోరుచు సభలుపై సభలు జరుపుచున్న సమయమునను, జీవిత భీమావ్యాపార రంగమున నూతన విధానములను ప్రవేశపెట్టవలసిన అవుసర సమయమునను శ్రీయుత పట్టాభి సీతారామయ్యగారు అధ్యక్షత వహించుటెంతయు సమంజసము. శ్రీయుత పట్టాభి సీతారామయ్యగారు ఆహ్వానసంఘమువారి ఆహ్వానము నంగీకరించి గుంటూరు ఏజంట్ల మహాసభకు అధ్యక్షత వహించి మహాసభను జయప్రదముగా నడిపించెదరని నమ్ముచున్నాము. ఆంధ్రదేశములో పని చేయుచున్న దేశీయ భీమాకంపెనీ ఏజంట్లు అందరును గుంటూరు మహాసభకు ప్రతినిధులుగా విచ్చేసి ఒక్క వేదికపై నుండి తమ కష్టసుఖములను గూర్చి మాట్లాడుకొని తమ అంత్య తీర్మానములను కంపెనీలవారికి నివేదించుట అత్యవసరమని తలంచి యీ మహాసభకు తప్పక హాజరై జయప్రదముగా నడిపించెదరని నమ్ముచున్నాము.

## II

# ప్రమాదములవలన మరణములు

## (Accident Deaths)

ఈమధ్యసంవత్సరములలో తేల్చబడిన దామాయిషాఅంకెలను బట్టి చూచిన హిందూ దేశములో ప్రతిసంవత్సరము దాదాపు రెండు వేల (2000) మంది జనులు అడవిమృగములచే చంపబడుచున్నారు.

ఇందులో

1000 మంది పెద్దపులులవలనను
275 మంది తోడేళ్లవలనను
175 మంది చిరుతపులులవలనను
100 మంది మొసళ్లవలనను
75 మంది అడవిపందులవలనను
75 మంది ఎలుగుగొడ్డులవలనను
75 మంది ఏనుగులవలనను
225 మంది పేరు తెలియని ఇతర అడవి మృగముల వలనను చంపబడుచున్నారు.

ప్రతిసంవత్సరము అడవిజంతువుల వలన చంపబడేజనులసంఖ్యా మొత్తమునకు 20 లగాయితు 25 రెట్లు పాముల కాటువలన చనిపోవుచున్నారు. ప్రతి సంవత్సరమ పాముకాటువలన చనిపోయే సంఖ్య నలుబదివేలు (40,000) లగాయతు యాబదివేలు (50,000) వరకు ఉండును. ఒక్క అడవిమృగములు, పాముల వలననే గాక యింక యితరములగు ఎన్నియో పలురకములగు ప్రమాదములవలన ప్రతి సంవత్సరమును జనులెంతమందియో చనిపోవుచున్నారు.

ఎత్తుప్రదేశములనుండి పడుటవలనను విద్యుత్ శక్తి వలనను రైళ్ళు, పడవలు, మోటార్లు స్టీమర్లవలనను, ఫ్యాక్టరీ యంత్రముల వలనను, ఆటలలో (Games) తగులు దెబ్బలవలనను, భూకంపములవలనను, మామూలుగా యిండ్లు కూలుటవలనను వాయువిమానములవలనను రోడ్డుమీద నడచు మోటబండ్లప్రమాదముల వలనను, దొమ్మిదెబ్బలాటవలనను, ప్రమాదములవలన నీటిలో పడుటవలనను, అగ్నివలనను, పడగామ్పువలనను మొదలగు ఇట్టి అనేకములగు ప్రమాదములవలన ప్రతిదినమును ఎంతమందియో చనిపోవుట మనము వినుచున్నాము.

ఇట్టి ప్రమాదములవలన ఒక్కొక్కప్పుడు కొంతమందికి చావు తప్పి కన్నులొట్టపోయి శాశ్వత అంగవైకల్యము (Permanent Disability) కూడ తటస్థించుచుండుట అరుదు కాదు. ఇట్టి మరణములసంఖ్యలో అనేకులు ఉద్యోగస్థులుకూడ నుందురు.

ఇప్పుడిప్పుడు కొన్నికంపెనీలవారు తమపట్టాదారులలో ప్రమాదములవలనచనిపోయిన పట్టాదారులకు భీమాచేసిన మొత్తమునకు రెట్టింపు భీమా మొత్తము నిచ్చు షరతులనుగూడ ఏర్పాటు చేసియున్నారు. ఇందుకుగాను మామూలుగా తీసుకునే సంవత్సరప్రీమియంగాక ప్రమాదమువలన మరణము సంభవించినప్పుడు రెట్టింపు భీమా మొత్తము నిచ్చుటకు పట్టాదారువృత్తిని బట్టి రు 1000 కి రు 1-8-0 మొదలు రు 2/-లు వరకు అదనము చార్జి తీసుకొందురు.

ప్రమాదములవలన అంగవైకల్యము సంభవించినప్పుడు కూడ ముందు చెల్లింపవలసిన ప్రీమియములను చెల్లింప నక్కరలేకయే భీమా

మొత్తమును వాయిదాలమీద పట్టాదారు పొందుటకు చాలకంపెనీలలో అవకాశములు గలవు. కావున భీమాచేయించుకునే ప్రతి వారును కొంచెము అదనపుప్రీమియం చెల్లించి ప్రమాదములవలన గలుగు మరణములు సంభవించినప్పుడు రెట్టింపు భీమా మొత్తములాభమును, అంగవైకల్యప్రమాదమునకు గలుగ చేసిన సౌకర్యమును పొందుదురుగాకయని కోరుచున్నాము. అంగవైకల్యము సంభవించినప్పుడు పొందు సౌకర్యమునకు అదనపు ప్రీమియం ఏమియు చెల్లింప నక్కరలేదు.

---

## III

# రెండవఆంధ్రదేశదేశీయ
# భీమాకంపెనీ
# పట్టాదార్ల మహాసభ, గుంటూరు

**(The Third Andhra Desa Indian Insurance Companies Policy Holders Comference, Guntur)**

1936 సెప్టెంబరునెల 27 తేదీని గుంటూరు పురమున రెండవ ఆంధ్రదేశ దేశీయ భీమా కంపెనీ పట్టాదార్లమహాసభ సమావేశము కానున్నది. ఆసమయమున పట్టాదారులకు ముఖ్యముగ కావలసిన విషయములనుగూర్చి చర్చలు సలుపబడును. స్వల్పకాలములో యిండియాలో యిన్సూరెన్సు లా మార్పు కానున్నది. కంపెనీ వ్యాపార పరిపాలనలలో పట్టాదారులకు కావలసిన హక్కులను, పట్టాషరతులలో పట్టాదారులకు కంపెనీలవారు చూపవలసిన సౌకర్యములను గూర్చి పట్టాదారులు విపులముగ చర్చించి తమ అంత్య తీర్మానములను కంపెనీల వారికిని ప్రభుత్వమువారికిని తెల్పుట అత్యవసరము. ఆంధ్రదేశములోగల భీమాపట్టాదారులు ఇట్టి తరుణమును బోగొట్టుకొనక గుంటూరులో జరుగబోవు పట్టాదార్ల మహాసభకు విచ్చేసి తమ తమ అభిప్రాయములను వెల్లడిపరుచుట యుక్తము.

156 వ పేజీ తరువాయి.

10. 1929-35 మధ్య యీదిగువ అంశలపై జరిగిన వివరములను గూర్చి ఒక్కొక్కదానిపై ఒక్కొక్క పేరా వ్రాయుము.

(ఎ) సొమ్ముమీదను అప్పుల మీదను యిచ్చిన మారుటోరియం (తగ్గింపు సొమ్ములు).

(బి) తనఖాలమీద యిచ్చిన మారుటోరియం.

(సి) భీమాకంపెనీలు రిసీవరుషిప్పులోనికి వెళ్లుట.

(డి) పట్టాలపై అప్పులు.

వరా:—ఇపుడు అమెరికాలో ఇన్సూరెన్సు బ్రోకర్లుకు ఒక ప్రత్యేక చట్టాన్ని ఏర్పాటు చేశారు. అందులకు వేరే పరీక్షలను ఏర్పాటు చేసిరి. లండనులో ఇన్స్యూరెన్సు బ్రోకర్లుకు వేరే పరీక్షలు యిదివరకే వున్నాయి.




1936 సం॥ రం సెప్టెంబరు 26, 27 తేదీలలో గుంటూరుపురమున తృతీయ ఆంధ్రదేశ దేశీయ భీమాకంపెనీ ఏజంట్ల మహాసభ సమావేశమగును.

*      *      *

1936 సం॥ రం సెప్టెంబరు 27 తేదీని గుంటూరు పట్టణమున ద్వితీయ ఆంధ్రదేశ దేశీయ భీమా కంపెనీపట్టాదార్ల మహాసభ సమావేశము కానున్నది.

*      *      *

బందరుపురమున 'లక్ష్మీ ప్రావిడెంటు యిన్సూరెన్సు కంపెనీ' అను పేరుతో శాస్త్రీయ పద్ధతులతో నడుపబడు ఒక ప్రావిడెంటుకంపెనీని స్థాపించుచున్నారు. అందులకు తగిన యేర్పాటులు పూర్తియగుచున్నవి.

*      *      *

లాహోరు భారత యిన్సూరెన్సు కంపెనీ యొక్క పాత బోర్డు ఆఫ్ డైరక్టర్లలో పూర్తిగ మార్పులను, డైరక్టర్లకు సంబంధించిన బంధువులకు కంపెనీలో ఉద్యోగములు యివ్వకుండునట్లును యీ కంపెనీలోనున్న డైరక్టర్లకు గాని యీడైరక్టర్లచే నిర్వహింపబడుచున్న యితర కంపెనీలకుగాని అప్పుల నివ్వకుండునట్లును నూతన ఏర్పాటులతో కంపెనీవ్యాపారమునకు భంగములేనట్టి తగిన కట్టుదిట్టములను చేసి మామూలు వలె పనిని విరివిగా సాగించుచున్నట్లు కంపెనీ వారు ప్రకటించియున్నారు.

*      *      *

గుంటూరు పట్టణమునుండి ప్రతినెల ప్రకటింపబడుచున్న "భీమాప్రచారిణి" అను భీమా మాసపత్రికను యికముందునుండి మూడునెలలకొకసారి (Quarterly) గా మార్పుచేసి ప్రచురించెదరని ప్రకటించియున్నారు.

*      *      *

గుంటూరుపట్టణమున ముందునెలలో జరుగనున్న తృతీయ ఆంధ్రదేశ దేశీయ భీమాకంపెనీ ఏజంట్ల మహాసభకు అధ్యక్షత వహింపవలెనని కోరుచు శ్రీయుత డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారికి ఆహ్వానము పంపియున్నట్లు తెలియుచున్నది.

*      *      *

విశాఖపట్టణంలో నున్న భారతమాతా కామన్ వెల్తు ఇన్సూరెన్సు బ్యాంకు, లిమిటెడ్-అను ప్రావిడెంటు భీమాసంస్థ హైయరు (Higher) లైఫ్ యిన్సూరెన్సు కంపెనీక్రింద మార్పుచేయుటకు ఏర్పాటులు జరుగుచున్నవని తెలియుచున్నది.

*      *      *




# ఆంధ్ర ఇన్స్యూరెన్సు కంపెనీ ఏజంట్లు
# తృతీయ వార్షిక సభ

ఆగష్టు 2 వ తేదీని బెజవాడలో శ్రీ దుర్గా విలాసభవనమున యీ సంఘసభ శ్రీశనివారపు సుబ్బారావుగారి అధ్యక్షతక్రింద సమావేశమయ్యెను ఈ సభకు వివిధజిల్లాల నుండియు, నైజాంనుండియు ఏజంట్లు వచ్చిరి. కంపెనీమేనేజింగు డైరెక్టరు, కార్యదర్శులు సభకు వచ్చిరి.

ముఖ్య తీర్మానములు.

1. ఈ కంపెని డైరెక్టర్లలో కీ॥ శే॥ సర్ మోచర్ల రామచంద్రరావు పంతులు, పి. వి. దాసుగార్ల అకాలమరణములకు యీ సభవారు తమ విచారమును తెలియబుచ్చుచు వారికుటుంబములకు సానుభూతిని తెలుపుచున్నారు.

2. ఈ సంఘ అధ్యక్షత పదవికి శ్రీ చె॥ వేం॥ నరసింహంపంతులుగారు యిచ్చిన రాజీనామాను అంగీకరించుచు, తాము యిచ్చిన యీ రాజీనామాను తగిన కాలవ్యవధితో యీ సంఘముయొక్క అభిప్రాయమును తెలిసికొనుటకు యిచ్చి అటుపిమ్మట మరొకకంపెనీకి వెళ్ళిన బాగుండియుండేదని యీ సభవారు అభిప్రాయపడుచు వారిచ్చిన రాజీనామా అంగీకరించిరి.

3. శ్రీ చె॥ వేం॥ నరసింహంపంతులుగారికిన్ని, యీ కంపెనీవారికిన్ని జరిగిన వ్యవహారములో యీ ఒండొరులకు గలిగిన ఎడబాటునకు యీ సభవారు తమ విచారమును వెలిబుచ్చుచున్నారు.

4. ఈ సంవత్సరం అమలులో పెట్టబోయే షరతులను ముందుగా యీ సంఘంవారితో సంప్రదించిన ధర్మసమ్మతముగ యుండేదనియు, యిటుల చేసియుండినచో యిదివరలో యీ సంఘమువారు చేసిన తీర్మానములలో కంపెనీవారు ఆమోదించిన అంశములనుకూడ నూతన షరతులలో చేర్చకుండా వుండుట తటస్థించియుండెడిది కాదనియు అభిప్రాయపడుచు యీనూతనషరలయొక్క మంచిచెడ్డలను కంపెనీ డైరెక్టర్లకు రాబోవు డైరక్టర్ల సభలో తెలుపుటకుగాను యీ సంఘముతరఫున శ్రీయుత శ॥ సుబ్బారావు, చె॥ సుబ్రహ్మణ్యం, య॥ రామబ్రహ్మంగార్లు నియమించబడిరి.

5. మూడువత్సరాలుగాని లేక 50 వేల వ్యాపారము చేసినగాని అట్టి యేజంట్లయొక్క రెన్యూయల్ కమిషను ఏటేటా యిచ్చే కనీసపు

వ్యాపారపు షరతును లేకుండా స వత్సరం 1 కి రు 25/—ల వరకు రెన్యూయల్సు యిచ్చే స్థితి యున్నంతవరకు ఏజంట్లకుగాని, ఏజంట్ల వారసులకుగాని, లేక ఏజంట్ల వ్రాతమూలకంగా తెలిపినవారికిగాని యిచ్చుచుండేలాగున ఏజన్సీషరతులను మార్పుచేయించవలెనని తీర్మానింపబడెను.

6. రెన్యూయల్సుతో సంబంధంలేకుండా ఏజంట్లలో పర్మనెంటు డిజేబులు అయినవారికిన్నీ, రిటైరు అయినవారికిన్నీ, వారుచేసినపనినిబట్టి మొత్తంగా యిచ్చే సొమ్మును సర్వీసునుబట్టి ఏలా యిచ్చేది తెలిపి యొక గ్రేడెడ్ స్కేలు ఏర్పాటుకు కోరబడెను.

7. కంపెనీవారికిన్నీ ఏజంట్లకున్ను వచ్చేతగాయిదాపరిష్కారములకు అనవసరంగా కోర్టులకు పోకుండా వుండుటకుగాను మధ్యవర్తిపరిష్కారమునకు వీలుండే షరతులకు ఏజన్సీషరతులలో నేర్పాటుచేయవలెనని కోరబడెను.

8. వయస్సునిర్ధారణ వాగ్మూలముమీదను ఆమోదించే విషయంలోను, క్లైము ఫారముపై కౌంటరు సిగ్నేచరుచేయువిషయంలోను కంపెనీవారే తమ ఆనరరీఅధికార్లను నియమించుటలో ఏజంట్లు పట్టాదార్లు మున్నగువారిలో నుంచి ప్రతితాలూకాలోను ఏర్పాటుచేయించవలెనని తీర్మానింపబడెను.

9. ఏజన్సీ అప్పాయింటుమెంటు ఏయేటి కాయేడు రెన్యూచేయు ఏర్పాట్లు లేకుండా నుంటూ ఏజంట్లను తొలగించే స్థితిలో మూడు నెలలగడువునోటీసు యిచ్చి మధ్యవర్తి పరిష్కారమైనపిమ్మట తొలగించే షరతులను ఏజన్సీషరతులలో ఏర్మాటుచేయ తీర్మానించబడెను.

10. పాలసీహోల్డర్లుతరఫున ఏజంట్లతరఫున డైరెక్టర్లలో 1/3 వంతుచొప్పున ప్రాతినిధ్యముకు కోరబడెను. పాలసీహోల్డర్లు అంతా ఎన్నికలలో నిలబడినట్లుంటూ యీ ఎన్నికలలో పాలసీహోల్డర్లుతరఫున ఎన్నికలలోను ఏజంట్లుతరఫు ఎన్నికలలోను తపాలాద్వారా వోటుయిచ్చే ఏర్పాట్లుండునట్లు కోరబడెను.

11. ఈ సంఘమును ఇండియన్ ఇన్సూర్యెన్సు ఇన్‌స్టిట్యూట్యు, ఇండియన్ ఇన్సూర్యెన్సు ఫీల్డువర్కర్సు ఎసోసియేషన్, ఆంధ్రదేశభీమా ఏజంట్లసంఘములోను ఎఫీలియేషను చేయుటకు తీర్మానించబడెను.

12. తెలుగుభీమాపత్రికను యీ కంపెనీయేజట్లంతా తెప్పించుకోవలెనని హెచ్చరింపబడెను.

13. కంపెనీలవారు కమీషను రేట్లలో పోటాపోటీలు కల్పించి యీవృత్తికి అగౌరవం రాకుండా నుండుటకు ప్రొక్రిపషను ఖర్చులలో యింతపర్సెంటుకన్న హెచ్చుచేయరాదను నియమమును గౌరవింపవలెనని ఆంధ్ర భారత భీమాఏజంట్ల సంఘంవారి దృష్టిలోనికి తెచ్చుకొనుచున్నారు.

14. ఈదిగువవారు కార్యనిర్వాహకులుగ ఎన్నుకోబడిరి.

అధ్యక్షులు:—శనివారపు సుబ్బారావుగారు.

ఉపాధ్యక్షులు:—చెరువు సుబ్రహ్మణ్యంగారు.

కార్యదర్శి:—యద్దనపూడి రామబ్రహ్మంగారు, బి. ఏ.

సభ్యులు:—కె. నారాయణరావు, కొటికలపూడి సూరన్న, మ॥ వెం॥ సుబ్బయ్య, మొవ్వా ఆదినారాయణగార్లు.

సం॥ శ. సుబ్బారావుగారు,
అధ్యక్షులు

# భారతదేశంలో విదేశీ భీమాకంపెనీల వ్యాపారం

( మల్లెల శ్రీరామమూర్తిగారు )

జూన్ సంచికలో "స్వదేశీకంపెనీలలోనే ఎందుకు భీమా చేయాలి" అనేవిషయం చర్చించబడినది. ఇప్పుడీవ్యాసంలో భారతదేశంలో జరుగుతూన్న విదేశీ భీమాకంపెనీల వ్యాపారాన్ని గురించి చర్చించబడుచున్నది.

అసలు భీమా వ్యాపారం పాశ్చాత్యులవల్లనే కనిపెట్టబడి, మొదట వారే కంపెనీలు స్థాపించి, వారే మన దేశంలో ఏజంట్లను పెట్టి భీమాచేయించటం ఆరంభించారని యిదివరకే తెలిపిఉన్నాను. ఆకారణంవల్ల మన దేశీయభీమాకంపెనీలు లేని ఆరోజుల్లో మన దేశీయులు విదేశీకంపెనీలలోనే తమ జీవితాలను భీమాచేసుకుంటూ వచ్చారు. అందువల్ల గతనలభై యాభై సంవత్సరాలనుంచి ఆ విదేశీకంపెనీలకు మన దేశంలో ప్రాపకం ఏర్పడి స్థాయిచిక్కింది. 1927 సం॥రంకు పూర్వం నూటికి 80 వంతుల భీమా వ్యాపారం మన దేశంనుంచి విదేశీకంపెనీలకు చెందేది. ఎక్కువకాలంనుంచి ఉండడంవల్ల పట్టాదార్లు ఎక్కువమంది అయినారు. ఆకంపెనీలలో భీమా చేసినవారు చాలామంది మరణించటం, వాళ్ల కుటుంబాలకు భీమా మొత్తాలు రావటం జరిగింది. ఆకారణాలవల్ల ఆకంపెనీలకు మంచిపేరు రాక తప్పిందికాదు. మన దేశీయకంపెనీలు వృద్ధిఅయిన మీదట 1927 సం॥రంలో జరిగిన భీమావ్యాపారంలో నూటికి 42 వంతులు విదేశీకంపెనీలకు, మిగతా 58 వంతులు మన దేశీయకంపెనీలకు చేరినది.

స్వదేశీకంపెనీలలోనే భీమా చేసేలాగున చేయవలసిన బాధ్యత ప్రతిభారతీయుడిమీదనూ ఉన్నది.

మన ఆంధ్రదేశంలో విదేశీకంపెనీలన్నిటిలో సన్ లైఫ్ కంపెనీవారికే ఎక్కువ భీమావ్యాపారం పోతున్నదని చెప్పవచ్చు. కారణం గత 40 సంవత్సరాలనుంచి ఆకంపెనీకి గల వ్యాపారప్రాపకమే అనడంలో సందేహంలేదు. ఇక ఆకంపెనీ ఏజంటు భీమాప్రచారానికి మొదలుపెట్టుతూనే కవిలికట్ట విప్పి కనబడ్డవారికల్లా గత 40 సంవత్సరాలలో చచ్చిపోయిన పేర్లజాబితా వారికి కంపెనీవారిచ్చిన వేలరూపాయిల లెక్క చూపించి మాకంపెనీ మహాగొప్పదంటాడు! క్లెయింలు చాలాతొందరగా పరిష్కారం చేస్తుందని, మాకంపెనీ పెట్టి నూరేండ్లు దాటిందని ప్రగల్భాలు పలుకుతాడు. ఈ స్వదేశీకంపెనీలు నిన్నగాక మొన్న పుట్టినవి. మూలధనం బొత్తిగా లేదు. ఎవరికినా యీ కంపెనీ యీ వూళ్లో డబ్బు యిచ్చిందా? లాభాలుకూడ యివ్వడంలేదు. మాకంపెనీకి మూలధనం ఎంత ఉందో చూడమని ఆ కెనడా దేశంలో ఉన్న ఆస్తి కాగితాలమీది అంకెలు చూపిస్తాడు. క్లెయింలు యిచ్చినవారి జాబితా ఏ వంద పేర్లో ఏకరువు పెట్టుతాడు. వాళ్లను కనుక్కో, మాకంపెనీసంగతి అంటాడు. ఇదీ ధోరణి. ఈవిధంగా పేర్లు మొత్తాలు చూపించేసరికి భీమాతత్వం, స్వదేశీ కంపెనీల వ్యాప్తి తెలియని మన దేశీయులు భ్రమపడి గబాలున విదేశీ కంపెనీలో భీమా చేశారు, చేస్తున్నారు. చదువుకున్నామని గర్వించే పెద్దలు చాలామంది యీనాడుకూడ సన్ లైఫ్ వంటి విదేశీకంపెనీలలో భీమాచేస్తున్నప్పుడు సామాన్యవిద్యావంతులైన వారు ఏజంట్లుచెప్పే మాటలు నమ్మిచేయడంలో

ఆశ్చర్యంలేదు. అదిగాక సన్‌లైఫ్‌కంపెనీ యిచ్చే పట్టాకూడా చాలాఅందంగా డాబుగా ఉంటుంది. అదికూడా భ్రమపెటుతుంది మనవాండ్లను. ఈవిధంగా తమకంపెనీలకుగల ఎక్కువజీవితాన్ని పురస్కరించుకుని పూర్వపుపేరుతో విదేశీకంపెనీలవారు తమవ్యాపారాన్ని గుంజుకుపోతున్నారు. అంతేకాకుండా విదేశీకంపెనీలవారు ఏజంట్లకు మొదటిసం॥రం ప్రీమియంమీద చాలా హెచ్చుకమీషను యిస్తారని ప్రతీతి. ఆకారణంవల్ల ఆఏజంట్లు తమ కమీషన్లలో కొంత నష్టపెట్టుకుని భీమా చేసే వారికి, మధ్యశిఫార్సుదార్లకు లాభం చూపించి కూడా విదేశీకంపెనీలకు వ్యాపారం సంపాదించుచున్నారు. ఇయ్యది భీమాఏజంటువృత్తిలో చాల గర్హణీయము.

విదేశీకంపెనీలకు మన దేశంనుంచి సాలుకు 100 కోట్ల రూపాయిలు ప్రీమియంలుమూలముగా చెందుచున్నవి. ఈ మొత్తమంతయూ ఆయాదేశములకు, ఆయాదేశ ప్రజల యభివృద్ధికి తోడ్పడుతుందిగాని మనదేశానికి ప్రజలకు వీసమంతయినా తోడ్పడదు. అట్టి స్థితిలో విదేశీకంపెనీలలో భారతీయులు భీమాచేయడంకంటె మహాద్రోహం మరొకటి లేదు. ముఖ్యంగా సన్‌లైఫ్ కంపెనీయొక్క జన్మస్థానమయిన కెనడాదేశంలోకి భారతీయులు కాలుపెట్టటానికీ వీలులేదు. అట్టి కెనడాదేశానికి చెందిన కంపెనీలలో భారతీయులు భీమాచేయడం చాల లజ్జాకరమైన విషయమని మనవిచేస్తున్నాను.

విదేశీకంపెనీలఏజంట్లుఎన్నిమాటలు చెప్పినా, ఎన్నికాగితాలు చూపించినా, మనదేశీయులకు భీమాతత్త్వం సరిగా తెలిసియేయున్నచో వారి మాటలు నమ్మి భీమాచేయరు. ఏ కంపెనీలోనైనా ఎక్కువగా భీమాలు చేస్తుంటే చావులు వచ్చి ఇచ్చిన మొత్తాలు కనుబడునుగాని చేయనిదే రావుగదా అని భీమాచేసేవారికి తెలిసియుంటే వాళ్ళమాట నమ్ముతారా? జీవితభీమాకంపెనీలు దివాలా కావని, వాటిమీద ప్రభుత్వతనిఖీ ఉందనీ, భీమాకంపెనీల ఆస్తి దినదినం అభివృద్ధిఅవుతుందని మనవారికి తెలిస్తే ఆవిదేశీకంపెనీలలో భీమాచేస్తారా? చేయరు.



ఈ భీమారహస్యమంతా మన దేశీయులకు తెలియకపోవుటకు బాధ్యులు దేశీయ భీమాకంపెనీలవారే అనటానికి సందేహంలేదు.

ఏమంటే: సన్‌లైఫ్‌కంపెనీవారు ప్రీమియం కట్టమని పాలసీదారుడికి పంపే ప్రతినోటీసుతో ఆకంపెనీఅభివృద్ధి చూపించే కాగితాలు అందంగా, చక్కగా, విపులంగా ముద్రించి పంపుతారు. ఆసంవత్సరంలో అప్పటికి ఎంతవ్యాపారం జరిగిందీ, ఆ కంపెనీకి ఆస్తి ఎంత ఉన్నదీ, ఎంత మొత్తం కంపెనీ పాలసీదారులకు చెల్లించినదీ, అదంతా స్పష్టంగా ఆ ప్రీమియంకాగితముతో వచ్చే ప్రకటనపత్రంవల్ల తెలుస్తుంది. అది చూడగానే పాలసీదారుడికి సంతోషం కలగడం సహజం. క్రొత్తవాడికి కూడా మోజు కలుగుతుంది. మనదేశకంపెనీలలో ఓరియంటల్‌కంపెనీవారు కొంతవరకు పాశ్చాత్యులను అనుకరిస్తున్నారు యీవిషయంలో.

అంతకు తప్ప తదితర దేశీయకంపెనీలవారు అట్లాంటి ఉత్సాహకరమైన ప్రకటనలు చేయరు. కంపెనీలవారు ఆయా రాష్ట్రాల్లో చెల్లించిన క్లయింమొత్తాలు దేశభాషల్లో ముద్రించి పాలసీదారులకు ఇతరులకుకూడా పంపి ప్రచారం చేస్తుంటే క్రొత్తవ్యాపారం జరగడానికి చాలా అవకాశంఉంది. అనేకవ్యామోహాలు పెట్టి తమ వ్యాపారాన్ని విదేశీకంపెనీలవారు సాగిస్తున్నా, మన దేశీయకంపెనీలవారు విదేశీకంపెనీలకు భీమావ్యాపారం పోకుండా ఆపలేకపోతున్నారు. 180 దేశీయ భీమాకంపెనీలు భారతవర్షంలో దశదిశలా వ్యాపారం చేస్తున్నా' విదేశీకంపెనీలకు

100 కి 40 వంతుల భీమావ్యాపారం పోతున్నదంటే దానికి బాధ్యులు దేశీయభీమాకంపెనీలవారేనని చెప్పగలుగుతాను. దేశభాషల్లో భీమాతత్వం తెలిపే గ్రంథాలు లేవు ఏజంట్లు తప్ప కంపెనీలతరఫున భీమాప్రచారకులు లేరు. భీమావాఙ్మయం అసలేలేదు. భీమానుగురించిన పత్రికలైనా యీకంపెనీలవారు నడపడంలేదు. అలాంటిపనులను కంపెనీలవారు పూనుకుంటేనే మనదేశప్రజలకు భీమాతత్వం తెలుస్తుంది. విదేశీకంపెనీలకు వ్యాపారం పడిపోతుంది.

మనదేశీయ భీమాకంపెనీలవారు నేర్చుకున్న తారకమంత్రం నకటే, అది ఎంతసేపటికీ ఏజంట్లమీద సవారీలు తీయడం, దబాయించడం, వ్యాపారం రాబట్టుకోవడం తప్ప, కంపెనీఅధికార్లు, అంటే డైరెక్టర్లు అధ్యక్షులు మొదలైనవారు స్వయంకృషిగా భీమావ్యాపారాన్ని సంపాదించడంలేదు. పైగా ప్రచారశాఖలు ఏర్పరచి కూడా భీమాతత్వం ప్రజలకు బోధచెయ్యడం లేదు. ఇందునుగురించి ముందు మరో వ్యాసంలో విపులంగా చర్చించబడుతుందని విన్నవించుకుంటూ మనదేశీయులంతా మనదేశీయ కంపెనీలలోనే తమ జీవితాలు, తదితరములు భీమా చేయించి, దేశకల్యాణమునకు తోడ్పడవలెనని ప్రార్థించుచూ విరమించుచున్నాను.

## A. C. I. I. లండను పరీక్ష

(129 పేజీ తరువాయి)

6. రాబోవు జన్మదినమునకు 52 సం॥ రములుగల ఒక సివిలుఉద్యోగి భార్య తన స్వంత ఆస్తిమీద వచ్చే రాబడితో 9 వత్సరముల యీడుగల కుమారునికిన్ని 20 వత్సరాల యీడుగల వ్యర్థురాలైన కూతురునకున్నూ భుక్తి కలుగజేయుటకుగాను భీమాచేయుదలచెను. ఈమెభర్త భీమాచేయుటకు అసర్థుడుగా నుండెను. అట్టి భర్తద్వారా ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపవలెను. ఈ స్థితిలో నీవు యీకార్యమును ఏలా సాధిస్తావు? [మార్కులు.

7. (ఎ) ఒక గ్రంథకర్త తనపుస్తకముమీద నుండే హక్కును యితరులు పొందకుండా ఎంత కాలం ఉంచుకోగలడు?

(బి) 'A' అనే భీమాకంపెనీ కలుగబోయే అపాయములను గూర్చిన ఒక బొమ్మను వ్రాయించి తన ప్రాస్పెక్టస్సులో వేయదలచెను. (బి) అనే ఫొటోకంపెనీ యిందుకు తగిన ఫొటోను తీయుటకు అంగీకరించి (సి) అనువానిని యీ పనికి గాను నియమించెను. ఈస్థితిలో తయారు అయిన ఫొటోయొక్క కాపీరైటు (హక్కు) ఈముగ్గురిలో, ఎవరికి ఉంటుంది?

[మార్కులు 25 వెరశి 200

దీనితో A. C. I. I. లండనుపరీక్ష కండవలసిన ప్రశ్నపత్రములన్నియు పూర్తి అయినవి. అనగా-

పార్టు I లో గ్రూప్పు A లో 3 న్నూ
పార్టు I లో గ్రూప్పు B లో 3 న్నూ
పార్టు II లో గ్రూప్పు A లో 3 న్నూ
పార్టు II లో గ్రూప్పు B లో 3 న్నూ
వెరశి 12

పరీక్షాప్రశ్నల పత్రాలతాలూకున్నూ తర్జుమా చేసి ప్రచురింపబడెను. వీటిని బట్టి జూచినచో యీ శాస్త్రంలో వుండవలసిన పరిజ్ఞానం భీమాకంపెనీపరిపాలకులన్ను ఏజంట్లకున్ను ఎంత అవసరమో తేటతెల్లమవుతోంది.

ఈ విషయమై పరీక్షలకు చదివే వారు యీ దిగువవారికి వ్రాసి కనుగొనవలెను.

చిరునామా:—శక్రటరీ ఆంధ్రకాలేజి ఆఫ్ కామర్సు, రాజమండ్రి




(శ్రీ॥ సుబ్బారావుగారు)

### ఉత్తరం ప్రత్యుత్తరాలు మాతృభాషలో ఏలా వుండాలి?

ఆంగ్లభాషలో యీ వ్యాపారమునకు సంబంధించిన వుత్తర ప్రత్యుత్తరములను గూర్చి అనేక గ్రంథా లున్నవి. భారత దేశంలో బయలు దేరే కంపెనీలలో ఏరాష్ట్రములోనికంపెనీలు ఆరాష్ట్ర వాసులతో వుత్తర ప్రత్యుత్తరాలు రాష్ట్ర భాషతో జరుపుతామని చెప్పుతారేగాని ఆలా జరిపితీరాలని వ్రతంపెట్టునవి లేనేలేవు. రాష్ట్రేతరవాసులతో ఏలాగా ఇంగ్లీషుభాషతో జరపాలి. ఆంధ్రదేశములోనున్న కంపెనీలవారు ఆంధ్రములో వ్యాపారరీత్యా వుత్తర ప్రత్యుత్తరాలను ఏలా జరుపవలెనో అనునది అలవాటు చేసుకోలేదు. ఆంధ్రమున వ్రాస్తే అగౌరవమని కూడా అటుల వ్రాయకుండా నున్న వారున్నారు. ఆంగ్లభాషలోని వుత్తర ప్రత్యుత్తరాలలో లేదు. అనే చెప్పే మాటకు అతిపొందికగా అనేకవిశేషణాలనువేసి చెప్పడం వుంది. మాతృభాషలో అటుల చెప్పుటకు తగిన భాష యింకా వ్యాపించ లేదు. మాతృభాషలో వుత్తర ప్రత్యుత్తరాలు వ్రాస్తే పెటుకుగానుంటాయనియు, పొందికతో వ్యాపారరీత్యా అవసరమువెంబడిని బుజ్జగించడం గాని చిరాకుపడడంగాని వీల్లేదని చెప్పడంగాని చేయవలసినపుడు ఆంగ్లభాషలోవలె మృదువుగా చెప్పడానికి వీలులేదంటారు. ఇందలి సత్యాసత్యములు నా అనుభవంలో తెలుపుతాను. నాకు ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీతో 1928 నుండియు సంబంధం ఉంది. నేను గతరెండేండ్లనుండి తెలుగులో వుత్తరాలు వ్రాస్తాను. కంపెనీవారు ఇంగ్లీషులో జవాబు యిస్తారు.

కంపెనీవారుకూడ తెలుగులో జవాబులు యియ్యడం అలవాటుచేస్తే వ్యవహారపు ఉత్తరాలు తెలుగుభాషలో ఏలాఅభివృద్ధిపొందాలో కంపెనీవారికిన్ని కంపెనీలతో సంబంధం వున్నవారికిన్ని అలవాటై ముందుసంతతివారికి యీ విషయాలలో దారితీసినవార మగుదు మనేది గ్రహింపకోరిక.

ఆంగ్లమున జరిగే వుత్తర ప్రత్యుత్తరాలలో ఆఖరున Your's faithfully, Your's truly అనునవి మామూలుగా వాడతారు. తెలుగున ఇట్లు అని వ్రాయడంవుంది, చిత్తగించవలెను అని వ్రాయడం వ్యవహారపు ఉత్తరాలలో ఉండదు. కాని వ్రాసేవా రున్నారు. ఆఖరున ఏమియు వ్రాయకుండా సంతకంపెట్టితే బాగుండదేమో అని అనిపిస్తుంది. ఆంగ్లములోవలె ఆంధ్రములో వ్రాయు వర్తక వ్యవహారపు వుత్తరాలలో ఆఖరున ఏలావ్రాస్తే బాగుంటుందో బుద్ధిమంతులు యోచించి కొన్ని మతలబువుత్తరాలను అలవాటుకొరకు ప్రచారంలోనికి తెచ్చుటకు యీ పత్రికద్వారా యత్నింప కోరిక.

# భీమాశాస్త్ర పరీక్షలు — అమెరికా

(శనివారపు సుబ్బారావుగారు)

ఇదివరలో లండనుపరీక్షలకు సంబంధించిన ప్రశ్నపత్రములను గూర్చి ప్రచురింపబడెను. ఈ దిగువను అమెరికా దేశముయొక్క భీమాపరీక్షలలో ఏజంట్లకు సంబంధించినవాటియొక్క ప్రశ్నపత్రములు యీదిగువ వివరింపబడెను. C. L. M. అను డిగ్రీ యిస్తారు. అంటే చార్టర్డు లైసెన్సీ యేట్ అండర్ రైటరు అని పేరు. ఈపరీక్ష 2 భాగములుగను మొదటిభాగములో రెండుపరీక్షలున్నూ రెండో పరీక్షలో 2 భాగములుగను విడదీసి మొత్తం నాలుగు పరీక్షాపత్రములను యిస్తారు.

మొదటిభాగములో

మొదటిపరీక్షాపత్రమునకు

1. లైఫ్ ఇన్సూరెన్సుకంపెనీ.

2. శాస్త్రరీత్యా ఏర్పడిన మరణములనుబట్టి ఏర్పరచే భీమాప్రీమియంపట్టీల రేట్లు.

3. ప్రీమియమ్ము.

4. భీమాపట్టా కంట్రాక్టు.

రెండవపరీక్షాపత్రములో

1. కంట్రాక్టులోని వివిధరకాలు.

2. ప్రత్యేక సౌకర్యాలు.

3. క్లైములపరిష్కారము (చనిపోయిన తర్వాత సొమ్ము యిచ్చుట).

4. పరిశ్రమలలో పనిచేయువారి కేర్పడిన భీమాలు.

రెండవభాగములో

మొదటిపరీక్షాపత్రములో

1. రిజర్వు (నిలువ) సరండరువాల్యూ(పట్టాకు యిక సొమ్ము కట్టడం మానివేస్తూ కట్టినంత వరకు వచ్చే సొమ్మును తీసుకొనుట)

2. ప్రమాదములు కలుగకుండా నుండుటకు గాను వాటిల్లో మంచి జీవితములను ఏరుట.

3. మధ్యరక ప్రమాదములుగలవారి జీవితముల విషయంలో ప్రవర్తించే విధాలు.

4. సాలుసరి ఆదాయ వ్యయపట్టిక.

5. నిలువఆదాయపు సొమ్ములను పెట్టుబడి పెట్టు విధాలు.

రెండవపరీక్షాపత్రంలో

1. కంపెనీపరిపాలనలోని అంతర్విభాగముల యొక్క ఏజన్సీఏర్పాట్లు.

2. భీమాచట్టము, భీమాకంపెనీలపై ప్రభుత్వమునకున్న అధికారము.

3. భీమాన్యాయశాస్త్రము.

4. జీవితభీమాచరిత్ర.

భీమాశాస్త్రమంతటిని 17 భాగములుగ జేసి 4 పరీక్షాపత్రములుగ ఏర్పాటుచేసిరి. లండను పరీక్షలకన్న యీ అమెరికాపరీక్షలు కొద్దిపాటి సులువుగ కనబడును.

భారతదేశములో కూడ భీమాపరీక్షలకు ఇండియా గవర్నమెంటు నొక చార్టర్డుకు యిచ్చుటకు భీమాకంపెనీలవారు, ఏజంటు, సామ్రాజ్య శాసనసభ్యులు కృషిచేయవలసి ఉంది.

ఇన్స్యూరెన్సు ఇన్‌స్టిట్యూటు ఆఫ్ అమెరికా, ఇక్ కార్పరేటెడ్.

పరీక్షలు 1935-36

జీవితభీమా మొదటిభాగం

శుక్రవారం ఏప్రియలు 17,1936

మొదటిపరీక్ష.

ఈదిగువప్రశ్నలలో 10 ప్రశ్నలకు జవాబులు వ్రాయుము.

1. (ఎ) జీవితభీమా అన నేమి ?

(బి) జీవితభీమాను ప్రజలు కొనుటకు గల కారణాలలో మూడింటిని యిమ్ము.

2. (ఎ) ఇన్సూరెన్సు కంట్రాక్టుయొక్క పెట్టు

బడి అంటే ఏమిటి ? దీనికి ఉదహరణ ఇమ్ము.

(బి) భీమాకంట్రాక్టులో పోయినదానికి బదులు ఇచ్చే ఏర్పాటు అంటే ఏమిటి ? ఉదహరణ ఇమ్ము.

3. వాటాలతో ఏర్పడిన భీమాకంపెనీకిన్ని వాటాలుపద్ధతి లేకుండా (షేర్సు) మ్యూనియల్ పద్ధతితో (అనగా పెట్టుబడిసొమ్మును డిబెంచర్ల రీత్యా ఏర్పాటుచేయుటయు ప్రతి భీమా పట్టాదారు కంపెనీలో భాగస్వామిగ నుండుటలో లాభాలు అన్నియు పట్టాదార్లవే) ఏర్పడిన భీమాకంపెనికి వుండే ముఖ్యభేదాలు ఏమిటి ? వీటియొక్క నిర్మాణమును గూర్చి వ్రాయవచ్చు.

4. జనహితమునకు ఎక్కువ రక్షణగా జీవిత భీమాయొక్క శాస్త్రరీత్యా ఏర్పడ్డ రిజర్వు (భవిష్యత్తుయొక్క ఉపయోగమునకు దాచిపెట్టి ఉంచేసొమ్ము) లేక జీవితభీమాయొక్క ఎస్సెస్మెంటు (పన్ను) రీత్యా ఏర్పడ్డ సొమ్ముగాని ఉండునా? నీజవాబును ప్రతివాదించుచు (డిఫండు) వ్రాయుము.

5 (ఎ) మరణముల పట్టీలలోని మూడు రకాలను గూర్చి వ్రాయుము.

(బి) జీవిత భీమాకంపెనీలవా రుపయోగించే రకాలలో అందరు సర్వసాధారణంగా ఉపయోగించే రకం ఏది?

(సి) అందరు యీరకాన్నే సర్వసాధారణంగా ఉపయోగించుటకు కారణ మేమి?

6. (ఎ) జీవితభీమాకంపెనీలవారుమరణముల పట్టీలోనుపయోగించేముఖ్యవరుస(కాలము)ఏది?

(బి) మరణములపట్టీలో "ఎక్సుపెక్టేషన్ ఆఫ్ లైఫ్" (అనగా ఇంతకాలము బ్రతుకుతారని వేసే అంచనా)యొక్క విలువ ఏమిటి?

7. (ఎ) మామూలు జీవితభీమా పట్టాకు పట్టాదారు చెల్లించేవాయిదాసొమ్ము (ప్రీమియం) నికరంగా తేల్చిన ప్రీమియమూ (నెట్టు)? లేక మొత్తముగా తేల్చిన (గ్రాస్) ప్రీమియమా?

(బి) ఈ ప్రీమియములను తేల్చుటలో నుండే ముఖ్యసూత్రాల నిమ్ము.

8. జీవితభీమాపట్టా అన నేమి?

9. (ఎ) జీవిత భీమా దరఖాస్తులలో తెలియచేసిన అంశములకు గౌరవమిచ్చి నమ్మదగునా?

(బి) రిప్రిజన్టేషను (తెలియజేయు అంశమున)కున్ను వారన్టీస్ (అభయమిచ్చుట)కున్నూ ఉండే తారతమ్యమును గూర్చి వ్రాయుము.

10. ఎ అనువాడు తన దరఖాస్తుఫారములో తన తండ్రి మామూలుగానే చనిపోయెనని వ్రాసెను.

ఎ అనువాని తండ్రి ఆత్మహత్యవల్ల చనిపోయెను. కాని ఎ అనువానికి ఆసంగతి తెలియదు.

ఎ అనువాని ఆస్తిని అనుభవించేవారికి యీ విషయంలో నుండే హక్కులేమిటి ?

11. ఎ అనువాడు తన జీవితభీమా దరఖాస్తులో 42 వత్సరాల వయస్సును వేసెను. నిజానికి యీతనివయస్సు 38 ఇట్టిస్థితిలో వచ్చిన క్లైమును ఏలా పరిష్కరించాలి? ఇందులో ఎట్టి ముఖ్యసూత్రము ఇమిడివుందో దానిని వ్రాయుము.

12. జీవితభీమాకంట్రాక్టులో నిరాక్షేపణీయమైన (ఇన్కన్టస్టుబిలిటీ) అనుదానిని గూర్చి చర్చించి వ్రాయుము.

మొదటి భాగం

సోమవారం - ఏప్రియలు 20-1936

రెండవపరీక్షాపత్రము

ఈదిగువవాటిల్లో 10 ప్రశ్నలకు జవాబులు వ్రాయుము.

1. (ఎ) మామూలుగా నుండే జీవితభీమా పట్టామీద యిచ్చే లాభములను తీసుకొనుటకు భీమా చేసినవారిలో ఎట్టివారిని ఏలా తీసుకొని ఆ లాభాలు యిస్తారు?

(బి) భవిష్యత్తులో ఇయ్యబోయే లాభాలకు గ్యారంటీ (పూచీ) ఉంటుందా? నీ జవాబును సమర్థించుకొనుచు (డిఫెండు) వ్రాయుము.

2. (ఎ) మామూలుగా పట్టాకుండే ప్రతిఫలమును పొందుటకుగల అర్హతగలవారెవరు?

(బి) పట్టాలయొక్క ప్రతిఫలమును పొందుటకు గల అర్హతగలవారిలో మూడువిధాలను తెలుపుచు ఆమూడింటినిగూర్చి వ్రాయుము.

3. భీమావ్యాపారములో భీమావల్ల కలిగే ప్రయోజనము ఏలా ఇమిడిఉంది?

4. తిరిగి భీమా చేయు వ్యాపారంలో (రీఇన్స్యూరెన్సు) కంపెనీకి లాభమా? లేక చేసినవానికి లాభమా? నీజవాబును సమర్థించుకొనును ఇమ్ము.

5. (ఎ) జీవిత భీమాపట్టాలలో నుండే రకాలలో మూడుముఖ్యమైనరకాలపేర్లను ఇమ్ము.

(బి) ప్రతిదానిలో నుండే ముఖ్య సూత్రాలను గూర్చి విపులంగా వ్రాయుము.

6. జీవిత భీమాపట్టాలలో నుండే రకాలలో పై మూడురకాలలో నీ అవసరములను బట్టి నీ కేది బాగా వర్తించును? నీ జవాబును సమర్థించుకుంటూ వ్రాయుము.

7. ఈ దిగువవాటి లక్షణములను గూర్చి నిరూపించుము.

(ఎ) లైఫ్ అన్యూటీ (జీవిత వర్షాశనము)

(బి) డిఫర్డు అన్యూటీ (మరియొకప్పటికి తోసిపెట్టు ఏర్పాటుతో నుండే వర్షాశనము.

(సి) జాయంటుఅండ్‌సర్వైవర్‌షిప్పు అన్యూటీ (సమష్టిమీదను బ్రతికివున్నవానికిన్ని యిచ్చే వర్షాశనము.)

8. ఇష్టమునకు విడిచిపెట్టబడిన పరిష్కారములనుగూర్చి వ్రాయుము.

9 ఒక మొత్తంగా యిచ్చే పరిష్కారపు సొమ్ము (లమ్‌సమ్ సెటిల్‌మెంటు) మీద యిచ్చే రాబడిపరిష్కారము (ఇన్‌కమ్‌సెటిల్‌మెంటు)లో నుండే లాభములలో అయిదింటిని గూర్చి విపులంగా వ్రాయుము.

10. (ఎ) మొత్తంగాను (టోటల్) శాశ్వత అంగవైకల్యము (పర్మనెంటు డిజబిలిటీ) లోను వుండే ఏర్పాట్లనుగూర్చి విశదీకరింపుము.

(బి) రెండురెట్లుగా పోయినదానికిచ్చు ఏర్పాట్లనుగూర్చి (డబుల్ ఇండెమినిటీ) విశదీకరింపుము.

11. సమిష్టి జీవితభీమాలో (గ్రూప్ లైఫ్ ఇన్స్యూరెన్సు)

(ఎ) ఒడంబడిక చేసుకొను పక్షంవారు ఎవరు?

(బి) ప్రీమియములను ఎవరు చెల్లిస్తారు?

(సి) పనిలోనున్నవారి దృష్టిద్వారా కలిగే లాభాలు ఏవి?

12. పరిశ్రమల భీమాలో (ఇండస్ట్రియల్ ఇన్స్యూరెన్సు)

(ఎ) చెల్లించే షరతునుండే లాభమునుగూర్చి వ్రాయుము.

(బి) అయిదు వత్సరాలవరకు ప్రీమియములను చెల్లించాక పట్టా రద్దుకాకుండా నుండే షరతునుగూర్చి వ్రాయుము.

జీవితభీమా రెండవభాగం

మంగళవారం ఏప్రియల్ 21-1936

మొదటి పరీక్షాపత్రం

1. ముందుకు నిలువవుంచే సొమ్ములో (రిజర్వు) ప్రారంభము అంకెకు ఆఖరుఅంకెకు నుండే సంబంధమును గూర్చి విపులంగా వివరింపుము.

2. నిలువసొమ్ముమీద (రిజర్వు) నుండే

వడ్డీరేటు $3\frac{1}{2}$% నుండి 3% నకు తగ్గితే ఏమి ఫలితం కలుగుతుంది? ఎందుచేత?

3. మరణముల పట్టీల నిర్ణయంలో అమెరికా దేశపు అనుభవంతో ఏర్పాటుచేసిన మరణపు టేబిలు (అమెరికన్ ఎక్స్‌పీరియన్సు టేబిలు)ను వాడుటకు బదులు సెలక్టు టేబిలు (ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన మరణపు టేబిలు)ను ఉపయోగించి తేల్చిన సంఖ్యలవల్ల రిజర్వు(నిలువ)సొమ్ముకు ఏమి ఫలితం కలుగును? ఎందుచేత ?

4. మామూలుగా జీవితభీమాపట్టాలపైనుండే రిజర్వుసొమ్ములో యీ దిగువవాటిల్లో ఏది యెక్కువగా యుస్తుంది. ఎందుచేత?

(ఎ) తెలిపే ప్రీమియం రిజర్వు (సమత్వపు వాయిదాసొమ్ముల నిలువ.)

(బి) ఫుల్ ప్రిలిమినరీటరమ్‌రిజర్వు (మొదటి ఆరంభమునిలువ)

5 భీమాదరఖాస్తుదారు తాను భీమాచేయుటలో ముఖ్యంగా గౌరవింపదగిన అయిదు ముఖ్యాంశములను యీ దిగువవాటిల్లో తెలుపుతూ వ్రాయుము.

(ఎ) భీమాదరఖాస్తు

(బి) డాక్టర్సు రిపోర్టు

(సి) ఇన్‌స్పెక్షను రిపోర్టు

6. డాక్టరుపరీక్షలేని భీమాఅంశలలో

(ఎ) అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వృద్ధిఅవుతున్న అంశములనుగూర్చి విపులంగా వ్రాయుము.

(బి) ఇందువల్ల భీమాకంపెనీలకు కలిగే లాభములేమి?

7. మధ్యరకపు ప్రమాదములవల్ల కలిగే నష్టాలలో (సబ్ స్టాక్ వర్కు రిస్కుల)

(ఎ) మధ్యరకపు ప్రమాదము లన నేమి ?

(బి) "వయస్సులో వృద్ధి" (ఇక్‌క్రీజు ఇక్ ఏజ్) పద్ధతి అననేమి ?

(సి) ఈ పద్ధతుల ప్రమాదములలో ప్రత్యేకంగా వర్తింపజేసే పద్ధతులు ఏవి ?

(డి) భీమా చేసేవానికి కలిగే లాభాలు ఏవి?

8. సాలుసరి ఆదాయవ్యయపట్టికలో తెలిపే అంశాలతో యీదిగువవాటినిగూర్చి వ్రాయుము.

(ఎ) పట్టాబుజువుకు దాఖలుచేసే కాగితము (పోలసీ ఎగ్జిబిట్)

(బి) లాభము, నష్టము తెలిపే కాగితము.

(సి) లెక్కలు (ఎకౌంట్సు)

(డి) పట్టీగా వ్రాయుజాపితాలు(షెడ్యూల్సు)

9. కంపెనీయొక్క ఆస్తిపాస్తులను కనబరచుటలో సాధారణంగా యీదిగువవాటిని ఒకే తరగతిగా కనబరచడం ఉంటుంది.

(ఎ) రియల్ ఇస్టేటు ఓన్డు (స్వంతంగా నున్న స్థిరాస్థి)

(బి) తనఖాలు (మార్టిగేజెస్.)

(సి) ఒడంబడికదస్తావేజులు (బాండ్సు).

(డి) పట్టాలపై యిచ్చే అప్పులు (పోలసీ లోన్సు )

(ఇ) స్టాక్సు (ఉండజూచుకొను లెక్క )

(ఎఫ్) సొమ్ము (కాష్.)

పై వాటిల్లో భీమాకంపెనీలవారు పెట్టుబళ్లుగా పెట్టితే అట్టి పెట్టుబళ్లను గూర్చి చర్చించుతూ వ్రాయుము.

10. (ఎ) 1000 డాలర్లను 5% చొ॥ 10 ఏండ్లలో యిచ్చుటకు గాను 990 డాలర్లకు కొనుట. 5% చొ॥ వచ్చేరాబడి హెచ్చుగా ఉంటుందా? తక్కువగా ఉంటుందా?

(బి) కొన్నప్పటి ధరకు పుస్తకంలో నుండే ధర ఎంత ?

(సి) నియమితకాలము పూర్తిఅగు రోజుకు (మెట్యూర్యిటీ) పుస్తకం ధర ఎంత ?

జీవితభీమా రెండవభాగం
బుధవారం ఏప్రియలు 22-1936
రెండవ పరీక్షా పత్రం

1. జీవితభీమాకంపెనీలోని ఏజన్సీ, డిపార్టు మెంటును సదుపుటలో శాగించిఆఫీసులోనుండేపద్ధతినిగూర్చి వ్రాయుము. ఈ కంపెనీ అనేక దేశాలలో పనిచేస్తోందని తలచుకొనుము.

2. పార్టుటయము ఏజంటు (అప్పుడప్పుడు పని చేయు ఏజంట్లు)నుగూర్చి యీ మధ్యను జరిగిన విషయాలనుగూర్చి వ్రాయుము.

3. జీవితభీమాకంపెనీలోని హోముఆఫీసు (అసలుఆఫీసు లేక హెడ్డాఫీసు) యొక్క లా డిపార్ట్మెంటు(న్యాయశాస్త్రశాఖ)తో సంబంధముండే మూడు ముఖ్యమైన శాఖలనుగూర్చి వ్రాయుము.

4. 1000 డాలర్లుకు మామూలు జీవితభీమా పట్టా నున్నవాడు చనిపోయెను. ఈ పట్టాదారునిసొమ్మును రాబట్టుకొనుటకు యీ పట్టాదారున కుండే హక్కుదారునకున్ను జీవితభీమా కంపెనీలోని క్లైమ్సు డిపార్టుమెంటునకున్ను క్లైముయొక్క పరిష్కారమునకు జరిగే వ్యవహారములను గూర్చి క్లుప్తంగా వివరిస్తూ వ్రాయుము.

5. గట్టి విచారణలను సలుపుటకు గల కారణా లెపుడు వచ్చునో వాటిని తెలుపుము. ఆవిచారణలవల్ల కలిగిన ఫలితములను కొన్నిటిని వ్రాయుము. ఎపుడు అట్టి విచారణలు జరుగును?

6. ఇన్సూర్యెన్సు కంపెనీ చెల్లించే వివిధ రకాలపన్నులనుగూర్చి తెలుపుచు వ్రాయుము.

7. ఈ దిగువవాటిమీద వచ్చే రాబడులలో ఏవి ఫెడరల్ ఇన్ కంటాక్సుకు 1935 లో చెల్లించాలి.

(ఎ) 1000 డాలర్లు 1935 లో భర్త చని పోగా భార్యకు చెందెను.

(బి) 1933 జనవరి 1వ తేదీని 10వేల డాలర్లను చెల్లించగా 1935లో వర్షాశనముక్రింద 1000 డాలర్లు భీమాపట్టా ద్వారా వచ్చెను.

(సి) 40 డాలర్ల చొ॥ 20 సాలీనా వాయిదాలమీద లాభములులేని పద్ధతితో చెల్లించగా 1935 లో ఆపట్టా కాలపరిమితి పూర్తిఅయి 1000 డాలర్లు వచ్చెను.

(డి) 1000 డాలర్లు యిచ్చే పద్ధతిని సాలుకు 45 డాలర్ల చొ॥ 20 సాలీనా వాయిదాలకు లాభాలతో పంచిపెట్టే పద్ధతితో చెల్లించగా 1935 లో ఆపట్టాయొక్క కాలపరిమితి పూర్తికాగా అసలు 1000 డాలర్లున్నూ లాభాలుక్రింద 300 డాలర్లున్నూ వచ్చెను.

8. 20 ఏండ్ల వాయిదాలతో చెల్లించుటకుగాను తీసుకున్న భీమాపట్టాకు 5 ఏండ్ల సొమ్ము చెల్లించాక ఆపట్టాను ఒక పెట్టుబడిదారుకు దఖలుపరచి అప్పుగా కొంతసొమ్మును తీసుకొనెను. ఈ స్థితిలోనున్న పట్టాకు యికముందు కట్టే వాయిదాసొమ్ములను గూర్చియు, ముందు పంచిపెట్టే లాభాలను గూర్చియు, సొమ్ముగా కోరితే యిచ్చే సొమ్మునుగూర్చియు, చనిపోతే యిచ్చే సొమ్మునుగూర్చియు కంపెనీ ఎవరితో వ్యవహరించవలెనను అంశములనుగూర్చి చర్చించుతూ వ్రాయుము.

9. సోషియల్ సెక్యూరిటీ ఆక్టుకున్ను(సాంఘిక సేవా రక్షణచట్టము) వర్షాశనము (అన్యూటీస్) లకున్ను జీవిత భీమాతో నుండే సంబంధమును గూర్చి క్లుప్తంలో 3లేక 4పేజీలకు వ్రాయుము.

144 వ పేజీ చూడుడు.

# Life Insurance as a Career

By K. SUBRAMANI AIYAR, B. A., F. S. A. A., R. A.

*Incorporated Accountant and late Principal of the Sydenham College of Commerce, Bombay.*

( Continued from last issue )

Assuming that in the first ten years of your agency you are able to secure policies as indicated above, that the annual premium on a Rs. 1000 policy is Rs. 50 and that you are paid a commission of 30 per cent. on the first year's premium in respect of new business and a commission of 5 per cent. on subsequent premiums ( renewal premiums) in respect of all old business secured by you, your total income from commission will work out as follows and amount to Rs. 1,500 in the first year, Rs. 4,250 in the 5th year and Rs. 11,250 in the 10th year. Your total income in all the 10 years will amount to Rs. 57,250—an average of Rs. 5,725 per year, as worked out below.

| Year | Annual premiums colected on new business Rs. | Commission at 30 per cent on new business i.e. on col. 2 Rs, | Renewal premium collected on old business Rs. | Commission at 5 per cent on renewals etc. on col. 4 Rs. | Total Commission earned-colos 3 and 5 Rs. |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1st | 5,000 | 1,500 | nil | nil | 1,500 |
| 2nd | 5,000 | 1,500 | 5,000 | 250 | 1,750 |
| 3rd | 5,000 | 1,500 | 10,000 | 500 | 2,000 |
| 4th | 10,000 | 3,000 | 15,000 | 750 | 3,750 |
| 5th | 10,000 | 3,000 | 25,000 | 1,250 | 4,250 |
| Totals | 35,000 | 10,500 | 55,000 | 2,750 | 13,250 |
| 6th | 15,000 | 4,500 | 35,000 | 1,750 | 6,250 |
| 7th | 15,000 | 4,500 | 50,000 | 2,500 | 7,000 |
| 8th | 20,000 | 6,000 | 65,000 | 3,250 | 9,250 |
| 9th | 20,000 | 6,000 | 85,000 | 4,250 | 10,250 |
| 10th | 20,000 | 6,000 | 1,05,000 | 5,250 | 11,250 |
| Totals | 90,000 | 27,000 | 3,40,000 | 17,000 | 44,000 |

From the 11th year onwards for a period of at least 10 more years during which the policies already secured by you remain in force, you will draw a renewal commission of Rs. 5,250 per year, even if you thereafter secure very little new business — which means a monthly pension of over Rs. 400 on account of work already turned out by you.

## No Capital Needed.

Another feature about Life Insurance canvassing is that you are not required to invest any capital when starting work. Your guardians have only to maintain you in comfort and allow you some pocket money for six months when you are learning work and for twelve more months during the first year of your canvassing, which cannot amount to more than a total of Rs.1,500. Even this amount of Rs. 1,500 may easily be repaid by the end of your second year's canvassing. I may mention here that, to my knowledge, there are Chief Agents of Life Insurance Companies who earn in their 20th year Rs. 2,500 a month.

## Office Clerks, Secretaries and Managers Training Needed.

If you have no aptitude for outdoor work as canvassers, get trained in Life Insurance Practice and Accounts and enter a Life Insurance Office, and if you have specialised in this kind of

work, you will have chances of rising to positions carrying a salary of Rs.2,000 a month. Fifty years ago, when I assisted in drafting courses and syllabuses for the Madras Government Commercial Examinations, I had provided for an elementary and an intermediate examination in Life Insurance; but no classes were ever started for teaching that subject in Madras or elsewhere and later the examination in that subject was dropped. I wish that a Diploma in Life Insurance with a two years' course after the Intermediate, may be instituted either by Government or by the University and that provision be made in our colleges for training undergraduates for this Diploma. In the absence of such an Indian Diploma, I advise our young graduates and undergraduates to qualify for the Life-Branch Associateship Examination of the Chartered Insurance Institute of London, who hold their examinations in April every year in Madras, Bombay and other centres. It is a two years' course and the examination consists of two parts. You have to answer six papers in each part of the examination, and secure 50 per cent. in each paper and 60 per cent on the whole. The subjects prescribed for Part I include Mathematics of the Intermediate Standard, Elementary Physiology and the Principles and Practice of Life Insurance. The subjects prescribed for Part II include Life Insurance Accounts, Life Insurance Law, Organisation, Prospectuses, and Reports, There are private colleges in Bombay, Calcutta and Madras which train candidates for the examinations of the Chartered Insurance Institute of London. It is also possible to prepare for this examination by enrolling yourself as a member of one of the British Correspondence Courses of London. Two graduate clerks of the Mysore State Life Insurance Office have by adopting this course, been able to pass Part I of this examination. If you acquire such special qualifications, you will be able to start as probationary officers with prospects of rising to the highest positions in Life Insurance Companies.

**Prizes Available in Insurance Offices.**

As regards prizes available in Life Insurance Offices, I may tell you that there are hundreds of appointments on salaries ranging from Rs. 100 to Rs 500 Branch Secretaryships on salaries ranging from Rs 500 to Rs. 1,000 and a few prize appointments on Rs. 1,500 and Rs. 2000 a month. Promotions in a Life Insurance Office are solely on merit and on the extent of your usefulness to the company in which you are employed; they do not depend on mere seniority or the community to which you belong. I shall now give you a few instances of undergraduates who have risen to high positions by sheer merit. When in 1908 I started a Life Insurance Company in Bombay and worked as the Company's first manager, I engaged the services of matriculate who had been trained in my commercial classes for 18 months and started him on Rs. 40 a month. Later he succeeded me as a Manager and rose to Rs. 800 a month in 10 years and to Rs. 1,000 a month in 15 years. He is now the Head of the Life Insurance Section of another leading Insurance Company in Bombay on Rs 1,500 a month with early prospects of rising to Rs. 2,000 a month. Twenty-five years ago, a South Indian undergraduate was a clerk on Rs. 60 a month in the most leading Indian Life Insurance Company. He proved so capable and useful and so

loyal to his employers that in another 10 years, he was made one of their Branch Secretaries and posted to Banglore on Rs. 500 to Rs. 600 a month. He has since been made the Head of an important section of the Head Office in Bombay on Rs. 2,000 a month with travelling allowances and batta on the scale allowed for senior officers of the Mysore Government. I can go on indefinitely citing instances of this kind. There is no compulsory retirement at age 55 as in Government service. Your services will be retained till you are much older and so long as you are sufficiently useful in your company.

### Actuaries.

No Life Insurance Company can start work unless and until a trained and qualified Actuary has prepared for the company the necessary premia tables and prescribed the conditions on which the company may issue policies of Insurance under the different tables. The actuary's services are also required for periodically valuing the assets and liabilities of the company and declaring whether and to what extent the assets exceed the liabilities. This is a piece of work which a mere Accountant is not qualified for and is not entitled to perform. Hence the services of an Actuary are adsolutely essential for every Life Insurance Company either as a full time officer of the company, or at least as an occasional employee like the Legal Adviser or the Auditor. Actuarial Science is a highly specialized subject based oh Higer Mathematics and Statistics and requires prolonged training for a period of four years. The supply is now very limited in India though the demand is fairly large. Hence the market value is at present very high.

### Actuarial Examinations.

To become an Actuary, you have to pass the examinations of the London Institute of Actuaries in Parts I, II, III and IV in four successive years. The Institute's examinations are held every year in Madras, Bombay and Calcutta and are open to private candidates. Actuarial Science is taught in the Sydenham College of Commerce, Bombay, as one of the optional subjects for the B. Com. Degree of the University of Bombay, and the course prescribed corresponds to that prescribed for Parts I and II of the London Institute of Actuaries' examination. The professor of this subject in that college is a full-fledged Fellow of the Institute of Actuaries and is also the Chief Actuary of the Oriental Government Security Life Insurance Company, Bombay. Graduates in mathematics my attend these lectures without becoming candidates for the B. Com. Degree of the University of Bombay and will be enabled to pass in two years, Parts I and II of the London Institute of Actuaries. You will have to stay in Bombay for a third year and study in private for Part III of the London Institute's examinations under the occasional guidance of your professor who may be sometimes able to give you practical training in the Insurance Company where he is Chief Actuary. You will be elected an Associate of the London Institute on passing Part III. You will thereafter have to go to London for twelve months, attend the special coaching classes there and pass in Part IV. You will then be elected a Fellow of the Institute and become a fully qualified Actuary. I should advise you not to enter upon this course of Actuarial training, unless you have an aptitude for figures and have secured high

marks in higher Mathematics (it does not matter if you have failed in other subjects) and unless you make up your mind to preserve and not to give up the attempts till you have passed in all the four parts of the Institute's examination. Many have attempted in the past but have discontinued before completing the full course. It will be a waste of time and money if you discontinue in the middle of the course. It is not a difficult examination for a graduate who has the patience to continue this course for 4 or 5 years. The Acturial examination is only a qualifying examination where you pass, if you secure the prescrided percentage of marks, irrespective of your rank in the pass list. It is not a competitive examination like the I. C. S. where only a few are selected in order of the rank secured in the pass list. However large may be the percentage of marks that you secure at the I. C. S. examination, you may not be selected if there are a number of others that have secured still higher marks. I should advise bright mathematics graduates not to try for the I. C. S. but to try and become Actuaries, in which profession, the prizes available are as high as, if not higher than, in the I. C. S. and where the chances of qualifying are in your own hands irrespective of the attainments of competitors.

**Prizes in the Actuarial Profession.**

The supply is very limited while the demand is very large and the market value of an Actuary is at present high in India. There is room for at least 50 more qualified Actuaries, who can earn from Rs 500 to Rs. 2,500 a month. We have at present only two Fellows of the Institute of Actuaries and about half a dozen Associates. One of these Fellows of the Institute is barely 40 years old but is earning Rs. 2,000 a month as Chief Actuary of the Oriental Life Insurance Company and an additional Rs. 500 a month as part-time professor of Actuarial Science in the Sydenham College of Commerce, Bombay. The only other Fellow of the Institute is barely 30 years old but is earning Rs. 1,000 a month as Assistant Actuary of the above-named Insurance Company. The Associates are employed by the Government of India on a salary of about Rs. 1,500 and Rs. 500 a month. Four Associates are in public practice earning several thousands of rupees per year. At least 50 other Life Assurance companies will be glad to employ Fellows of the Institute as their whole-time officers on salaries ranging from Rs. 300 to Rs. 1,000 a month, if qualified men become available.

In conclusion, I should strongly advise some of you to qualify for Life Insurance business and go to any part of India, where you are able to secure a suitable position with bright prospects for the future. I advise Mysoreans to go to other parts of India, earn an honourable livelihood, build up a reputation for honesty and capacity and enhance the reputation of Mysore.

— INDIAN INSURANCE.

KANAKARAJU'S

# INSURANCE DIRECTORY

## 1936

(IN TELUGU)

WILL BE READY AND PUBLISHED IN
*SEPTEMBER—1936.*

A New publication in vernacular. Very useful to Companies, Agents and Policy-Holders. The only publication of its kind.

Price For Companies Rs. 3- For Agents and Policy-Holders Rs. 2-8-0

PRE PUBLICATION PRICE

For Companies Rs. 2-8-0 For Agents and Policy-Holders Rs. 2

Postage Extra in all cases. Book your orders immediately with advance.

*Apply to :—*

*THE EDITOR,*

***Bheema Patrica, Bezwada.***

Reg. No. M. 2749.





Printed and Published by the Editor at the Andhra Grandhalaya Press, Bezwada.